# ఒక విషయం

సమాజంలో సమత్వం రావాలంటే, రెండు ఆటంకాలను అధిగమించవలసివస్తున్నది. ఒకటేమో వర్ణధర్మం రెండవది వర్గతత్వం. ఈ రెంటినీ నిర్మూలిస్తేగాని సామ్యవాదం నెలకొనదు. వర్ణధర్మాన్ని నిర్మూలించాలంటే కులాంతరవివాహాలు కావాలి. వర్గతత్వాన్ని నిర్మూలించాలంటే భూసంస్కరణలూ, పరిశ్రమల జాతీయము చేయుటా- అత్యవసరాలు!

వర్ణాంతరవివాహాలు ఇందు ప్రోత్సహింపబడినవి. దేశమంతా యీ ఆదర్శాన్ని ఆచరిస్తే సమత్వం సత్వరం సిద్ధిస్తుంది. ఈ ఉద్యమానికి తలిదండ్రులే నడుంగట్టితే, ఇంకా సులభతర మౌతుంది.

"ర చ యి త"

## పాత్రలు

విద్యాసాగర్ — యూనివర్సిటీవిద్యార్థి
వినోదరావు — ,, ,, ,,
వినాయకరావు — రమాసుందరితండ్రి
ధనంజయరావు — విద్యాసాగర్ తండ్రి
సన్యాసిరావు —
పానకాలరావు —
పురోహితుడు —

## స్త్రీ పాత్రలు

రమాసుందరి — కాలేజీఅమ్మాయి

## వీధిరంగంలో

1. జట్టు:—నడిప్రాయంమనుషులు  సాధారణవేషం
2. జట్టు:—విద్యార్థులు
3. జట్టు:—ఇద్దరుశాస్త్రులు.
4. జట్టు:—ఇద్దరు బోడమ్మలు.



# మొదటి రంగం

[విద్యాసాగర్ తొందరతొందరగా డ్రెస్ వేసుకుంటూ వుంటాడు. ఇంతలో హడావుడిగా ప్రవేశిస్తాడు వినోదరావు. నిలువుటద్దంలో చూచు కుంటూ లాల్చికిగుండీలు పెట్టుకుంటూవున్న విద్యాసాగర్ ను తొందరగా చూస్తూ]

వినో:-ఎంతసేపోయ్ నీమేకప్పూ ! పెండ్లిచూపులకేమన్నా పోతున్నామనుకున్నావా ?

విద్యా:-(నూనెరాసినతలపై కొంచెంనీళ్లురాచుకొని అణగ బట్టిదువ్వుకుంటూ దువ్వెనతీసి నిదానంగాచూస్తూ) ఎందు కురా! ఎప్పుడూ అంతతొందరపెడతావ్ ?

వినో:-ఈ నశ్వరప్రపంచంలో క్షణాన్నొకయుగంగానూ, యుగాన్నొకక్షణంగానూ చూడాలోయ్ !

విద్యా:-అదీ ! అర్థోమంటే అర్థంకానివేదాంతాన్ని విసిరేస్తావ్!

వినో:-సరేలే, కానీ ! ఈపాటికి మీటింగు జరిగిపోయివుం టుంది.

విద్యా:-(తొందరసూచిస్తూ) అవున్రోయ్ ! ఇంతమంచిఛాన్సు పోగొట్టుకోగూడదు.

వినో:-ఆఛాన్సేగాదు ! తను రమాసుందరి......

విద్యా:-(తొందరసూచిస్తూ, ఉత్కంఠతతో) అపుడేవెళ్ళిందా యేమిటి ?

వినో:-వెళ్ళిందా యేమిటి? ఈపాటికి సగంవుపన్యాసం విని వుంటుంది.

విద్యా:-(ఇంకాతొందరపడుతూ) పదవోయ్, పద.

(తెర)

---

## రెండవరంగం

[రమాసుందరితండ్రి వినాయకరావు గదిలోకూర్చొనివుంటాడు, ఏదోఆలోచిస్తూవుంటాడు. గదిగోడలకు గాంధి, నెహ్రూ, వివేకానంద, ఫోటోలున్నాయి. శూన్యదృష్టితో ఆ పటాలవైపు చూస్తూవుండగా. రమాసుందరి ప్రవేశిస్తుంది.]

రమా:-నాన్నా! నాన్నా! ఏమిటంతగాఆలోచిస్తున్నారు?

వినా:-ఏమీలేదమ్మా! అట్లా గాంధీపటం కేసిచూస్తున్నా.

రమా:-గొప్పఉపన్యాసం నాన్నా! ఎంతబాగా మాట్లాడాడు! మీరుగూడా వచ్చివుంటే యెంత బాగుండేది! అంతా గాంధీఆశయాలే!

వినా:-ప్రతిదినం పేపర్లో చదువుతున్నాంగా అతన్నిగురించి! గొప్పఉద్యమకారుడు! ఉపన్యాసశిఖామణి, అన్నిటికంటే మించిందేమిటంటే అతడు ఆచరణదక్షుడు.

రమా:-ఆయన్నిగురించి చదవడం, వినడం చాలదునాన్నా! ప్రత్యక్షంగాచూడాలి. ఎంతఆకర్షణఅనుకున్నారు! ఎంత

బాగా ఉద్రిక్తపరుస్తాడనుకున్నారు. అతనిఉపన్యాస ఉర వడిలో ప్రేక్షకవర్గమంతా పరవశ్యంతొక్కిందనుకోండి.

వినా:-అంతేనమ్మా! అతనంతటివాడే! సేవాగ్రాంలోవుండంగా చాలాసార్లుచూశానతన్ని!

రమా:- (ఉత్సాహంతో) అతడుపన్యాసకుడేగాదునాన్నా! కవిగూడా! చూశావా, నా ఆటోగ్రాఫ్ పుస్తకంలో (ముందుకుచాచి చూపిస్తుంది.)

వినో:- "నీఆదర్శము శీతశైలమై.
నీ ఆచరణము మహాసింధువై
నీ గమ్యము శాంతిస్థాపనమై
నిలుచును, వెలయును, సుస్థిరమ్మునగు."

(అని గట్టిగాచదివి) బాగుందమ్మా! గొప్పభావం!

రమా:- అర్థమంతా పూర్తిగాబోధపడలేదునాన్నా! ఆదర్శం ఆచరణం, గమ్యం, అంటే తెలుస్తూనేవుంది. ఈపక్క పదాలను ఏభావంతో బంధించాడూ అని!

వినా:- ఇహీహీ (అని నవ్వి) మరి బి. ఎ. చతువుతున్నావ్! ఇంతమాత్రం తెలియకపోతే యెట్లా? అంతమాత్రం అంతరార్థం కనుక్కోలేకపోతే నీచదువుకు అర్థంయేమిటి?

రమా:- అదేమిటినాన్నా! మా తెలుగుక్లాసులో నేనే ఫస్టు.

వినా:-భలే! అయితే దీనికర్థం నీవేచెప్పు చూద్దాం.

రమా:- ఇంతకుముందూ ఆలోచించానునాన్నా ! ఏమీ స్ఫురించందే!

వినా:- ప్రతీపాదానికీ ఒక గొప్ప భావంవున్నది తెలుసా? నీఆదర్శము శీతశైలమై, అంటే-శీతశైలమంటే హిమ వత్పర్వతమన్నమాట ! అదిచాలా ఉన్నతమైనది. నీ ఆద ర్శాలు అంత ఉన్నతమైనవిగా వుండాలని భావం. నీ ఆచరణము మహాసింధువై, అంటే - సింధువంటే సముద్రం. ఎక్కువ లోతైనది. అంటే గంభీరమైనది. నీ ఆచరణలు అంతటి గాంభీర్యాన్ని ప్రదర్శించాలిఅనిఅర్థం. నీ గమ్యము శాంతిస్థాపనమై, అంటే - గమ్యం ఎట్టి దిగావుండాలి ? అది సత్ఫలప్రదమైందిగావుండాలి. అట్టిది శాంతితప్ప మరేమీలేదు. సదాదర్శాల ఆచరణ ఫలి తమే శాంతి. అదే దానిఅర్థం! నిలుచును, వెలయును, సుస్థిరమ్మునగు అన్నది పై మాటికీ క్రమంగా, అర్థ యుక్తంగా జోడించాడు.

రమా:- ఎంతభావం నాన్నా !

వినా:- ఇంతేగాదమ్మా, దీనికింకా యెంతైనా చెప్పవచ్చు. సర్వవిధాలా సమత్వాన్ని కాంక్షించి, సత్యమార్గాన్నే అవలంబించి, శాంతిని స్థాపించాలన్నమాట !

రమా:- ఇంత బాధ్యత మనం వహించాలన్నమాట !

వినా:- అవునమ్మా, అవును !

రమా:-ఇంత బాధ్యత మనపైన వుందని తెలిసిగూడా మన నాయకులే యెందుకాచరించడంలేదు ?

[పానకాలరావు ప్రవేశం]

పాన:-నాయకులేమిటి ? అంతా వినాయకులు - నమస్కార మండీ వినాయకరావుగారూ !

వినా:- ఓహో ! పానకాలరావుగారా! రండి! ఏమిటివిశేషాలు?

పాన:-ఏమున్నాయండీ ! ఆ సంస్కరణోపన్యాసానికి నేను గూడా వెళ్లాలేండి ! యువతీయువకులచేత ప్రతిజ్ఞలు గూడా తీయించుకున్నాడు ! అన్నట్లు రమాసుందరం గూడా ప్రతిజ్ఞ......

వినా:-(అడ్డొచ్చి) ఆఁ ఆఁ ప్రతిజ్ఞా ! కులాంతర వివాహం మాడతాననా !

పాన: -అవును ! లేకపోతే మరేమిటి ?

రమా:- (చంచల నేత్రాలతో అటూ యిటూ చూస్తూ వుంటుంది)

వినా:- అంత స్వతంత్రించా ? నిజమే ! (కండ్లు పెద్దవిచేస్తాడు)

పాన:- నిజమా అని గద్దిస్తారేమిటండీ ! అదేమిటి ? కోప్పడు తున్నట్టు కనిపిస్తున్నారు ! ఈ మాటలు అప్రియమైనవని తెలిస్తే అని వుండేవాణ్ణిగాదుసుమండీ ! ఏదో గాంధీఅను యాయులుగదా, సంతోషంగా స్వీకరిస్తారనుకున్నాను.

వినా:- సంతోషం చట్టుబండలయినట్టుంది. (కూతురును ద్దే శించి) ఔనా ?

రమా:- (కొద్దిగా భయపడుతూ) అవును.

వినా:-(కోపము రెట్టించి) అ...వు...ను ఏమిటి నీ మొహం? ఏం తెలిసి చేశావు ప్రతిజ్ఞ! నీవు మొగుణ్ణి వెతుక్కుంటూ పోతావా?

రమా:- వెదకడ మెందుకు?

వినా:- (పెద్దకోపంతో) నోర్మూయ్!

రమా:- మనం గిరి గీసుకొని కూర్చొని స్వకులం, స్వశాఖ అంటే ...

వినా:- (కండ్లెఱ్ఱ చేసి) ముయ్ నోర్, ఫో, అవతల. పోతావా లేదా! (వేలుచూపిస్తాడు)

రమా:-అదిగాదునాన్నా...

వినా:- (అడ్డొచ్చి) ఇంకామాట్లాడతావా గాడిదా (అంటూ లేవబోతాడు)

(రమాసుందరి నిష్క్రమణ)

పాన:- ఏదో లెండి, పోనీయండి, కుఱ్ఱచేష్టలు.

వినా:- హుఁ, కుర్ర చేష్టలు. యీ వెధవ చదువులే యీ బుర్ర తిరుగుడుకు కారణం!

పాన:- చదవకపోతే యేంజేస్తారండీ! పెండ్లిండ్లు కాకపోతే బడికన్నా పోక చేసేదేముంది?

వినా:- అపుడు మాత్రం వీళ్ళకు మొగుళ్ళు దొరికి అఘువ రించారా?

పాన:- అసలీ ఉద్యమమే అందుకటగా!

వినా:- ఉద్యమమూ, పీళ్ళవల్ల కాదూనూ!

పాన:- పోనిలెండి. నేను దుర్ముహూర్తంలో బయలుదేరి నట్టున్నాను. వస్తాను.

వినా:- అసలెందుకొచ్చినట్టు! ఏదో పనివున్నట్టుంది?

పాన:- అదే, అదేనండీ. మీరు కోడూరివారి సంబంధం హెచ్చరించమన్నారుగా! ఆవిషయమై వచ్చానులెండి.

వినా:- (సూటిగాచూస్తూ) అవునవును! ఏమయిందేమిటి?

పాన:- కొద్దిగా దారిలోపడిందిలెండి! అసలు, పిల్లవాడు కాస్త నల్లగా వుంటాడండీ. ఇంటరుతో ఆపేశాడట! ఆస్తివుందిమరి! అందుకోసం కట్నం హెచ్చుగా అడుగుతున్నారు.

వినా:- ఎంతడుగుతున్నారేమిటి?

పాన:- పదివేలయినా యివ్వక తప్పదట!

వినా:- (గుండెలుకొట్టుకొని) పదివేలే!

పాన:- అంతకు తగ్గరట! ఇంతకంటే మంచి సంబంధాలూ యెక్కువ యిచ్చేవీ వాళ్ళకు బోలెడున్నాయట!

వినా:- కాకరిపర్తివారి సంబంధం యేమయింది?

పాన:- ఓహో! వాళ్ళింకా పైనకూర్చున్నారు. పిల్లవాడికి ఒక కన్ను చిన్నది. బి. ఎ. పూర్తిచేయలేక చాలించాడట! యాభై యెకరాల మాగాణి వుందాయె! ఒకడే పిల్లవాడుగూడా, అందుచేత యాభైవేలకుతగ్గమన్నారు.

వినా:—(గుండె చేతుల్లోపట్టుకొని) హారి వీళ్ళఆశతగుల బడా! పిల్ల చదువుకున్నదని చెప్ప లేకపోయావా ?

పాన:—చెప్ప కేం! బి ఎ. ఈ సంవత్సరం పూర్తిచేస్తుందని చెప్పాను. మీ బి. ఎ. మాకెందుకండీ, ఆ బి. ఎ. అక్కడే పెట్టి రమ్మనండి. మాకు దానితో అక్కర లేదు. సంతకం చేసేంత చదువుగూడా మాకక్కర్లేదు. దగ్గరబంధువులే యెంతోమందివున్నారు. అదిపనిగా మీ రారుసార్లొచ్చి అడిగారుగదాఅని ఈమాత్రం చెబుతున్నాం—అన్నారు.

వినా:—యాభైవేల కట్నమే! (గుడ్లుపెద్దవిచేస్తాడు)

పాన:—అవును. యాభైవేలు.

వినా:-(మొగంచిట్లించి) మనకేముందని అడుగుతారయ్యా యింతింత కట్నాలు!

పాన:—పిల్లవుందని!

వినా:—పిల్లవుంటేమాత్రం! అంతంత మొత్తాలా అడగటం!

పాన:—అడక్కేంచేస్తారండీ! గిరాకీకాలంమరి! మనవి ఎన్నో కులాలామె! కులానికి కోటి జనసంఖ్యేమయినావున్నదా ? అందులోని నలుగురుకుర్రకుంకలకూ నాలుగువందలఅర్జీలు! మరివాళ్ళ యిష్టమొచ్చినట్టు అడక్క చేసేదేముంది ?

వినా:—ఛీ! కొంచెంగూడా నీతినియమాలూ, మంచీచెడ్డలూ లేవీకాలపు పిల్లవాళ్ళకు! పశువులమాదిరిగా అమ్ముడు పోవడానికి వాళ్ళమనసు లెట్లాఒప్పుతాయో! ఈపశు ప్రవర్తన......

[సన్యాసిరావు ప్రవేశం]

సన్యా:-(అందుకొని) పశుప్రవర్తన వాళ్ళల్లో యేముందండీ! వాళ్ళతలిదండ్రుల్లోవుందిగాని!

వినా:-ఓహో! సన్యాసిరావుగారా! రండి, రండి, కూర్చోండి!

సన్యా:-(కూర్చొని పై పంచతో విసురుకుంటూ) ఏమిటి? సాంఘికోపన్యాసాలు సాగిస్తున్నారు.

వినా:-ఏదో ప్రసంగవశాత్తుగా కట్నాలగొడవ లొచ్చాయి లెండి!

సన్యా-: అబ్బా! ఇవి మనప్రాణాలు తోడేస్తున్నాయండీ! మనసంతానంవల్ల యిన్ని యిక్కట్లువస్తాయని తెలిసేవుంటే వివాహమే ఆడకుండావుండేవాణ్ణి.

పాన:-మంచిమాట సెలవిచ్చారు.

వినా:-సగంమంది మగపిల్లలూ, సగంమంది ఆడపిల్లలూ గల మీ రేయిట్లాఅంటే యెట్లాగండీ! చాలామంది ఆడపిల్లలే గల పానకాలరావుగారి గతేంకావాలి?

సన్యా:-సత్వరం సన్యాసంపుచ్చుకోడమే!

పాన:-(నవ్వి) సన్యాసానికేం, దివ్యంగాపుచ్చుకోవచ్చు. అంత మాత్రాన వీళ్ళసమస్య తేలిపోదుగా!

సన్యా:-దివ్యంగా తేల్తుంది. వాళ్ళవిషయం వాళ్ళేచూసుకుంటారు.

వినా:-అట్లాగని వూరికే వుండగలమటండీ?

సన్యా:-ఉండక చేయగలిగిం దేమిటిచెప్పండి ?

వినా:-మన బాధ్యత మనంనిర్వహించాలిగా !

సన్యా:-మనభాధ్యతా చట్టుబండలూనూ! మనం యేడేండ్లనుంచీ ఎంతనిర్వర్తించాం చెప్పండి! మీపిల్లకు కట్నాల గొడవతోనే యింతవరకూవచ్చిందా? మరి, మాపిల్ల విషయం? మీకూనాకూ కట్నాలవిషయంలో కుదరక పోయె! అందరివిషయమూ యింతేయిప్పుడు.

పాన:-అత్యాశ పిల్లవాళ్ళల్లోవుందంటూరా, తలిదండ్రుల్లో వుందంటూరా ?

సన్యా:-పిల్లవాళ్ళల్లో అత్యాశ లేదు. అజ్ఞానంమాత్రంవుంది. తలిదండ్రులవిషయం వినాయకరావుగారు చెప్పాలి. (సాభిప్రాయంగా నవ్వుతాడు)

పాన:-మీరూ డౌరీవిషయంలో తంటాలుపడుతున్నారాలండీ!

వినా:-తెగేవరకూ సాగుతూనే వుంటుందిగా !

సన్యా:-అవునవును! తెగింపు తొందరలో నేజరుగుతుంది లెండి.

వినా:-ఇంకాజరిగితే ఆశాభంగం పొందాల్సొస్తుంది.

పాన:-ఇంతకూ బేరంయెంతవరకూ సాగింది?

సన్యా:-వినాయకరావు గార్నే అడగండి. యెంతవరకూ వచ్చిందో ?

వినా:-మీ రెంతవరకూ......

పాన:-(అడ్డొచ్చి) ఎవరుచెప్పినా ఒకటేగా! కట్నాలుయివ్వడంలోనూ, పుచ్చుకోవడంలోనూ, న్యూనతకనబడని యీ దినల్లో కించపడాల్సిన అగత్యంయేముంది ?

సన్యా:-న్యూనత బొత్తిగా లేకపోలేదులెండి! లేకపోతే వినాయకరావుగారు జవాబెప్పుడో చెప్పేవారు.

వినా:-అనవసరపుమాట లెందుకుగాని పానకాలరావుగారూ! నేను పది హేను వేలిమ్మన్నాను. కృష్ణశాస్త్రి ఇంటర్మీడియట్లో చేరినప్పటినుండీ సన్యాసిరావుగారు బేరంసాగించారు. మొదట్లైతే అయిదు వేలిమ్మన్నా ననుకోండి. ఇంటరుప్యాసయ్యాక పది వేలిమ్మన్నదివాస్తవం. మరి పోయినసంవత్సరం పాపం, ఎంతో కష్టపడి బి. ఎ. డిగ్రి సంపాదించాడు. ఎక్కువడగ లేదుసుమండీ పద హేను వేలే అడిగాను. ఇప్పుడుమరీ. పిల్లనిస్తామంటూ తెగవస్తున్నారు. బేరం ముప్ఫయి వేలవరకూ సాగిందనుకోండి. ఇంకా మావాణ్ణి యం. ఎ. కి పంపాలనుకుంటున్నా.

పాన:-పంపండి. పంపండి. ఇంకా కట్నంయెక్కువవస్తుంది పంపండి. ఫారిన్ కూడాపంపండి.

సన్యా:-ఎవరండీ ముప్ఫయి వేలిస్తామన్నది ? వాళ్ళా! పాలకొల్లువాళ్ళా ?

వినా:-అవును. వాళ్ళే !

సన్యా:-చూశారా పానకాలరావుగారూ ! ముప్ఫయి వేలిస్తామన్నది పాలకొల్లువాళ్ళట !

వినా:-కాదుకాదు. పది హేను వేలిస్తామన్న వాళ్ళు పాలకొల్లు వాళ్ళు.

సన్యా:-అసలు పాలకొల్లువాళ్లు పెత్తనానికిరాండే !

వినా:-అదిగాదండీ, వాళ్ళుగాదు. (బుఱ్రగోక్కొని) రాయల సీమవాళ్ళు.

సన్యా:-రాయలసీమ ఎట్లాంటిదో చూడకుండా వూరికినే తిట్టేవారు వాళ్ళతోసంబంధంచేస్తారా? మనగాలి సోకితేనే కస్సునేవాళ్ళతో సంబంధం యేమిటండీ? విశ్వసించాల్సిన మాటేనాయిది!

వినా:-(కాస్త ఉడుక్కుంటూ) ఒకళ్ళువిశ్వసించాల్సిన అగత్యం నాకేమీలేదండీ! మీవిశ్వాసంతో మాకేమీపనిలేదు.

సన్యా:-అట్లా వుడుక్కుంటున్నారేమిటండీ!

వినా:-ఉడుక్కోడమా? వట్టిమండే ప్రశ్నలువేస్తూ! ఎవ రెవరోరాందే అబద్ధాలుచెబుతారటండీ?(విసుగ్గా ప్రక్కకు చూస్తూ) క్రాసుపరీక్ష చేస్తాడేమిటీ పెద్దమనిషి!

పాన:-(అడ్డొచ్చి) కట్నాలవిషయంలో అబద్ధంచెప్పందెవరు లెండి. ఏదన్నా వస్తువునమ్మేటప్పుడు సిసలైనధరఎవడైనా చెబుతాడటండీ?

వినా:- ఇది అమ్ముకోడమా? వ్యాపారమా?

పాన:- అని, ఇటీవల ఆర్ట్సుకాలేజీలో ఒకతెలుగు లెక్చరర్ అంటున్నాడట! అదేగాదట! డౌరీమాటవస్తే ఆదినం క్లాసు అంతటితో సరట! ప్రస్తుతం యువకులంతా డౌరీల కోసం చదువుతున్నారనీ, పశువుల్లాగా అమ్ముడుపోతున్నా రనీ ఆటువంటి పశువులకోసం యీ ఆడపిల్లలు అంతగా ఎగబడడం అజ్ఞానం అనీ, డబ్బిచ్చి అవినీతిపరుల్ను చేసు

కోడం అవినీతి అనీ, అసలుదీనికి విరుగుడు కులాంతర వివాహంమేననీ- ఇట్లాంటి వాటెల్లో సరట!

వినా:- అఘువరించాడు ఆలెక్చరర్! అసలా పలుకులు యే విద్యార్థి వింటాడు?

పాన:- విద్యార్థులుగూడా వినకపోవడం లేదటగాని, ఆడ పిల్లలుమాత్రం ఆలోచిస్తున్నారట ఆవిషయంలో అధికంగా!

వినా:- అంతేలే! అది ఆడంగుల ఉద్యమం అవుతుంది.

సన్యా:- అది గాంధేయమార్గమట! నాన్ కో ఆపరేషన్ ఉద్యమం, ఉప్పు సత్యాగ్రహం, విదేశవస్తు బహిష్కరణోద్యమం ఖద్దరుఉద్యమం-ఇవన్నీ ఆడవాళ్ళ ఉద్రిక్త పరచి ఉద్యమాన్ని వ్యాప్తిపొందించి స్వరాజ్యం తెప్పించారని ప్రచారంచేస్తూ వుంటారటగా!

పాన:-ఈదినం సంస్కారణోపన్యాసంలోగూడా. అదే అన్నాడటగా!

సన్యా:- అంటే కులాంతర వివాహ ఉద్యమంగూడా ఆడవాళ్లే ముందుకొచ్చి నడపాలంటారుగదూ?

వినా:- మగపిల్లవాళ్ళు ముందుకురాందే ఆడపిల్లవాళ్ళేవర్ని చేసుకుంటారట! వీళ్ళంతా భీష్మించుకొని కూచుంటేసరి!

సన్యా:- అదే చేతగాదని అందరికీతెలుసు. అక్కరబడితే అటువంటి శక్తి ఆడవాళ్ళల్లో వుందిగాబట్టే అందరూ ఆడవాళ్ళను పట్టుక్కూడ్చున్నారు.

[పురోహితుని ప్రవేశం]

పురో:- అసలు ఆడదానికి స్వతంత్రమిచ్చి సంఘాన్ని తారు మారు చేస్తున్నారండీ!

సన్యా:- అంటే!

పురో:- ఏముందండీ? ఆడదాన్నీ శూద్రుణ్ణీ అంతదూరాన్నే వుంచమన్నారు మనశాస్త్రాల్లో. స్వతంత్రం అనేపదంలో ఎన్నక్షరాలున్నాయోగూడా వాళ్ళెరుగగూడదు. మరి యీనాడు యీ రెండు తెగలే విజృంభించాయి. మన సంఘాన్ని తలకిందులుచేసేటట్టున్నాయి. అసలు......

సన్యా:- (చిఱునవ్వుతో) మన్వాది ధర్మశాస్త్రాల్లో ఇంకా ఏం చెప్పారండీ శాస్త్రులుగారూ.

పురో:- మన్వాది శాస్త్రంలో స్త్రీ ధర్మాన్నిగురించిగొప్పగా చెప్పాడండీ!

సన్యా:- (నవ్వుతూ) మన్వాది శాస్త్రం యెవరు వ్రాశారండీ పురోహిత పుంగవా!

పురో:- అవన్నీ మనిషివ్రాసినటువంటి వటండీ! దేవుడు వ్రాసిపెట్టాడుగాని! ఓహ్హో, మానవుడే వ్రాసివుంటే యీపాటి కవన్నీ మట్టిగలిసి పోయేవి!

సన్యా:- నిజం నిజం! బాగా సెలవిచ్చారు. అసలవన్నీ మట్టి గలిసి పోతున్నాయి గాబట్టే మనుషులు వ్రాశారేమో అన్న అనుమానం కలుగుతూవుంది లెండి. మనుశాస్త్రాన్ని మనువు వ్రాశాడంటారు. మరి, మన్వాది శాస్త్రం యెవరు

వ్రాశారో యెవరికీ తెలీదు. బహుశా దాన్నిమాత్రం దేవుడు వ్రాసిఉంటాడు.

పురో:- (అజ్ఞానంగా తలవూస్తూ) కావచ్చు.

పాన:- } (గొల్లున నవ్వుతారు.)
సన్యా:- }

పురో:- (సందేహంతో వెర్రిమొగంవేసి ఇటూ అటూ చూచి) ఏం! నేంజెప్పింది అబద్ధమంటారా ? ఇపుడుమీాకు కనిపించటంలేదటండీ విరుద్ధ ధర్మాలూ! అసలు మన మంటే గౌరవమే లేకుండా పోతున్నదండీ(పాలకాలరావు వైపుచూచి నాలుక కొరుక్కొని) అదికాదు. మనం పిల్లలుగా వున్నప్పటి మర్యాదకూడా కనబడ్డంలేదు. ఇన్నెందుకు మా పౌరోహిత్యంలోనే చూడండి. ఇదివర కంతా భయమూ భక్తితో వుండేవారు. అడిగిందిచ్చే వారుగూడ. ఇపుడట్లా లేదు సరిగదా, ధిక్కారణకోసమే ఎక్కడన్నా రెండుశ్లోకాలు నేర్చుకొని మంత్రాలనూ మంత్రోచ్చారణలనూ తప్పంటున్నారు.

సన్యా:- (అడ్డొచ్చి) ఉచ్చారణ గాబోలు !

పురో:- అవునండీ ఉచ్చారణే, ఉచ్చారణ !

సన్యా:- (నవ్వుతాడు)

పురో:- ఉచ్చారణ సరిగా లేదనీ, మంత్రం తప్పనీ, అనవసర మైన చోటప్లుతం పలుకుతామనీ, స్వరితం చట్టుబండల

క్రింద మార్చేస్తున్నామనీ ఇట్లాంటివన్నీ అంటూ, దక్షి ణాల దగ్గరకొచ్చే టప్పటికి దాక్షిణ్యం లేకుండా అప హాస్యం చేస్తున్నాడు.

సన్యా:- ఎవరు ? పెండ్లివాళ్లే!

పురో:- పెండ్లివాళ్ళు కాకపోవచ్చు! వచ్చినచుట్టాలు! కుర్రకారుగుంపు!

సన్యా:- మన సంస్కృతాన్ని తప్పుపట్టడమే!

పురో:- అదేనండీ వచ్చిన అనష్టం! వాళ్ళనోళ్ళతోగూడా వుచ్చరించగూడని సంస్కృతాన్ని వాళ్ళు వుచ్చరిస్తు న్నారు. అందుకు శిక్షించడానికి ఏడీ? నాథుడేడీ? వేద మంత్రం విన్న శూద్రుడిచెవుల్లో సీసం కరిగించి పొయ్యా మన్నాడు......

(కర్త తెలియక తలగోక్కుంటూ వుంటాడు)

సన్యా:- మనువేలెండి!

పురో:- ఆc, ఆc, అతడే! చూశారా యెంత వికృతమై పోయిందో కాలం!

సన్యా:- ఇంకా వికృతం అవుతుందట! బ్రహ్మంగారు కాల జ్ఞానంలో చెప్పలేదా?

పురో:- అవునండీ! ఆ కంసాలోడు చెప్పిందంతా నిజమే అవు తున్నదండీ!

సన్యా:- వర్ణాలన్నీ కలిసిపోవాలనీ, అంతా ఒకటే అవుతా రనీ, అంతా శూద్రజాతే అయిపోతారనీ అన్నాడటగా!

పురో:- అనే వుంటాడండీ, వాడంటే తెలుగు లేదండీ?

సన్యా:-వర్ణం వర్ణం కలిసిపోతూ మనవర్ణంపైకిగూడా యెగబడుతున్నారట!

పురో:- హారి పిళ్ళతగలెయ్యా! ఈ చదువులు నాశనం చేస్తున్నాయండీ!

పాన:- మరి, మీ అమ్మాయినిగూడా చదివిస్తున్నారుగా!

పురో:-అందమూ చదివిస్తావుంటే యింట్లోవుండి చేసేదేముందని పంపుతున్నానండి!

సన్యా:-అంతేనా, పెండ్లిగాకపోతేనా?

పురో:-(నాలుక కరచుకొని) ఎంతమాట! మాయిండ్లల్లో ఆబాధలేదండీ! మాశాఖ ఇంకా అంతనీచానికి దిగలేదులెండి! చూశారా మనపినాయకరావుగారు ఎంతఉదారమైన నాయకులనుకున్నారు అందర్లాగానే ఆయనా పెద్దచదువులు చదివాడు. గాంధీజీతో కుద్దునతిరిగాడు. అనేక ఉద్యమాల్లో పనిచేశాడు. మరి, ఆయననిష్ఠకేమన్నా భంగం రానిచ్చేవాడా? హరిజనుని మాటెటుపోయినా, అసలు క్షత్రియాదివర్ణాలవారిని సైతం, సహపంక్తి విషయం అట్లావుంచండి—లోపలికయినా రానిచ్చేవాడా? ఆవిధంగా అంటీఅంటనట్లుగా వుండాలండీ! ఆ ఆదర్శాన్ని ఎవరు అనుసరిస్తున్నారు చెప్పండి!

సన్యా:-అవునవును! మీశాఖవాళ్ళు ఆవిషయంలో ప్రచండులెండిమరి, మీ యిండ్లల్లోనే యిపుడు ముప్ఫయియేండ్ల ముగ్ధలు పెండ్లికాకుండావున్నారు.

పాప:-అటువంటివాళ్ళకోసమేయిపుడీవస్తున్న కొత్తవుద్యమం!

పురో:-ఆఁ, వస్తున్నదటండీ! ఎక్కడికొస్తుంది? మనం రానిస్తేగదా రావడానికి!

సన్యా:-మనప్రమేయం అక్కర్లేకుండానే వస్తున్నదటండీ! కుర్రవాళ్ళే అందుకుపూనుకుంటున్నారు.

పాప:-ఎన్నేండ్లకూ పెండ్లికాకపోతే మరియిక చేసేదేమిటండీ!

పురో:-స్వకులంలో దొరక్కపోతే పరకులంలోనికి దిగటమే!

సన్యా:-ఏఁ, మనపురుషులకుండే అవయవాలు ఆ పురుషులకుండవా శాస్త్రిలూ!

పురో:-మీచమత్కారం మాకెక్కడొస్తుందండీ! మీచదువులంత చదవలేదుగా! అవయవాలు సామ్యంగా వున్నంత మాత్రాన సమత్వంవస్తుందంటారాండీ!

సన్యా:-మరికదేంట్లో!

పురో:-ఎన్నో వున్నాయిగదండీ, శుద్ధి, సూక్ష్మం, ఆచారం, ఆరోగ్యం......

సన్యా:-పోనీ, అవిమీకూ. మీఅన్నకూ సమానంగా వున్నాయా?

పురో:-అన్నిట్లోనూ లేకపోవచ్చు. ఒకవర్ణం అన్నభావం వుందిగా!

సన్యా:-అదీ! అదే భావంఅంటే! అన్నీ భావంపై ఆధారపడివున్నాయి. అన్నిట్లోనూ సమానత్వం లేకపోయినా, మావర్ణంలోనివాడుగదా అని సమత్వాన్ని ఆరోపించి,

ఆదరిస్తున్నావు! ఇతరచోట్లల్లో పుట్టినవాళ్ళను, అదే రీతిలో వున్నా మనభావంచేతనే వేరుగాచేస్తున్నాం.

పురో:-అంటే? అంతగా అర్థం కావడంలేదండీ!

సన్యా:-అర్థంకాకపోవడానికేముంది? ఆచారాలుపాటించినా పాటించకపోయినా, శుచీశుభ్రతలు అనుసరించినా అనుసరించకపోయినా, మంచిగుణాలు కలిగివున్నా కలిగిఉండకపోయినా, మనవాడుగదా అనేభావంతో సమతాదృష్టి వహిస్తున్నాం. అట్టిగుణాలే కలిగివున్నాగూడా ఇతరుల వేరొకదృష్టితో చూస్తున్నాం. అదేభావంఅంటే.

పురో:- ఎన్నన్నా ఈసాంకర్యానికి ఒప్పుకోలేమండీ! చూచి చూచీ! ...

పాన:- (అడ్డొచ్చి) రమాసుందరి మీా అమ్మాయేగదండీ!

పురో:- ఆఁ ఆఁ ఎందుకండీ?

పాన:- ఏమీాలేదులెండి (అవహేళనగా చిరునవ్వు)

పురో:- అదేమిటండీ? అదేమిటో సెలవియ్యండి.

పాన:- బి. ఎ. తొలిసంవత్సరం చదువుతూవుందిగదూ!

పురో:- (కాస్త తొందరచూపిస్తూ) అవునండీ!

పాన:- మీాటింగు కెళ్ళారా మీారు!

పురో:- ఛీ! ఛీ! అట్లాంటి మీాటింగులే!

పాన:- పాపం, మా అమ్మాయి ...

పురో:- వెళ్ళిందా?

పాన:- వెళ్ళడమేమిటి? వెళ్ళి ...

సన్యా:- వెళ్ళి ఉపన్యాసం వినిపుంటుంది.

పురో:- (ఏడుపు మొగం పెట్టి) అంతమందిలోనూ యేమన్నా వదిరిందా?

పాన:- (చిరునవ్వుతో) ఎందుకులెండి! మీరు బాధపడతారు.

పురో:- (బావురుమని ఏడ్చేంతకాగా) చెప్పండిబాబూ, వేధించకండి!

పాన:- స్వాకులాన్ని విస్మరించి...

పురో:- (ఏడుస్తూ) అయ్యో, అయ్యో, యేంజేసింది

పాన:- తొందరపడకండి! అట్లా యిదవుతారేం?

పురో:- (తల మొత్తుకుంటూ) ఏడిపించకండి!

పాన:- పరకులంలో పెండ్లాడతాను అని ప్రతిజ్ఞ చేసింది.

పురో:- ఆఁ. ప్రతిజ్ఞే! ప్రతిజ్ఞే! అయ్యో! దాని కర్మగాల! దానికేమొచ్చిందండీ! బంగారంవంటి వంశాన్ని, రత్నం లాంటి కులాన్ని వదిలేసి, ఏ మట్టిలో కలుస్తుందంట! ఓసి వెధవప్పీనుగా! అంట్లముండా! అన్యాయ్యపుతులవా! అనాచారప్పీనుగా! వస్తున్నానుండు! చీల్చి చెండాడుతాను! కండలుకోసి కాకులకేస్తాను. (చెప్పకుండానే, పైగుడ్డ చంకలో ఇరికించుకొనిపోతాడు) (వీళ్ళందరూ నవ్వుతూవుండగా)

(తెర పడుతుంది)

## మూడవరంగం

[విద్యాశేఖర్ యిల్లు. తండ్రి ధనంజయరావు కూర్చీలో కూర్చొని వుంటాడు. ప్రక్కన మరొక పెద్దమనుష్యుడు]

ధనం:- ఔనండి. ఆ ప్రకారమే చేద్దాం. అంతకుతగ్గితే మాత్రం అందంగా వుండదుసుమండీ! తీరా ఆ సమయం వచ్చాక, తక్కువతీసికొచ్చి రేపిస్తాంఅంటే బాగుండదు. అంతా అయ్యాక పెండ్లిపీటలమీదనుండి లేచేపని పెట్టవద్దు.

పెద్ద:- అబ్బే! అదేంవుండదులెండి ఆభయం మాకువుంది.

ధనం:- అసలుమీరు అదృష్టముహూర్తంలో వచ్చి పడ్డారు. మోటూరివారు మొన్నవచ్చి మొత్తుకున్నారుగదా, పాపం, యాభై వేలవరకూ వెళ్లారు. మరిఅదెందుకో తెగిందిగాదు. అదేగాదు, మోటుపల్లి మోపూరయ్య చౌదరిగారు, చాలాపలుకుబడీ ఆస్తీవున్న మనిషిలెండి, ఆయన మనిషిమీద మనిషిని నెలలపర్యంతం పంపాడనుకోండి! పిల్లగూడా, యేదో, హైస్కూల్లో చదువుతూ వుందటగూడాను. చాలామంచి సంబంధంలెండి. మావాడు ససేమిరా అని కూర్చున్నాడు.

పెద్ద:- మాసంబంధానికి మీవాడుఒప్పుకున్నాడాండీ!

ధనం:- మావాడొప్పుకోడ మెంతలేండి! అసలు రహస్యం చెప్పొద్దూ! మీ అమ్మాయి చదువుతోపాటు మంచి అందమైన పిల్ల.

పెద్ద:- మరి మీఅబ్బాయినోచ్చి చూచుకోమ్మనండి! అసలు పిలిపించి అడగండిప్పుడే!

ధనం:- పిలిపిస్తాను. మరి మనహోదాకు తగినట్టు కారుకావా లంటాడేమో. పిల్లవాడు! ముందూ మన లాంఛనాల మాట ముగించండి. తర్వాత అడగొచ్చువాణ్ణి.

పెద్ద:- ముందూ పిల్లవాణ్ణి ఊఁ అన్నీయండి. ఆపైనచూద్దాం అన్నీ.

ధనం:- అబ్బాయ్! విద్యా! ఒరేయ్!

[లోపల్నుండే ఆఁ, వస్తున్నా అంటూ ప్రవేశిస్తాడు]

ధనం:- (ముసిముసి నవ్వులు నవ్వుతాడు)

విద్యా:- (అనిష్టత సూచించే మొగంపెట్టి) ఎందుకునాన్నా!

ధనం:- ఒకసారి వీళ్ళవూరికట వెళ్ళొస్తావా? (చిరునవ్వుతో) వెళ్ళిరా!

విద్యా:- (అక్కరలేనట్లుగా) ఎందుకు?

ధనం:- గ్రహించగలిగికూడా ప్రశ్నెందుకురా?

విద్యా:- గ్రహించే అంటున్నా యెందుకూ అని.

ధనం:- గ్రహిస్తే ఎందుకెందుకురా.

విద్యా:- అందుకే! అక్కర్లే దనడానికి బదులు.

ధనం:- అక్కర్లేదంటే అర్థం?

విద్యా:- అదే అర్థం!

ధనం:- ఏమిటోయ్ ఆ వెటకారపు జవాబు.

విద్యా:- వికటంగా గ్రహిస్తే వెటకారంగానే వుంటుంది.

ధనం:-ఇంతకూ నీకేం తెలిసినట్లు ?

విద్యా:- కొంత తెలుసు గనుకనే !

ధనం:- తెలివిగానురా తెలివిమాలినవాడా, వివాహవిషయం!

విద్యా:- విన్నాను.

ధనం:- అయితే యింతవరకూ జరిగినదంతా విన్నావన్న మాట !

విద్యా:- అవసరమైనంతవరకు.

ధనం:- నీకిష్టం లేందేమిటి ?

విద్యా:- అదే! మీరుభావించేదే !

ధనం:- అదేమిట్రా, కట్నమూ అసలువివాహమూ !

విద్యా:- అదే! కట్నంతోడి వివాహం.

ధనం:- (బాగా కనబడకుండా పండ్లుబిగించి) ఓరి వెఱ్ఱివెంగళప్పా! ఉన్నవాళ్ళు మోజుపడి యేదో యిస్తామంటూ వుంటే పుచ్చుకోడానికేమి తప్పురా ?

విద్యా:- "మోజుపడి" అన్నది మీవంటివారి మోజుపడం గాబట్టి.

ధనం:- ఇందులో తప్పేమిటో కాస్త చెబుదూ! పిల్లగలవాళ్ళు ఏమీ యీకుండా ఊరికినే అత్తగారింటి కంపుతారట్రా! పిల్లకోసం, వాళ్ళేదో మోజుపడి యిచ్చేదానికి అభ్యంతరమేమిటో కాస్త చెబుదూ !

విద్యా:- ఆ విధంగా జరగడం అంత తప్పుకాకపోవచ్చు.

ధనం:- మరింకేమిటి ?

విద్యా:- అట్లా జరగడం లేదుగా బట్టీ!

ధనం:- మరింకెట్లా జరుగుతున్నదంటావ్ ?

విద్యా:- పిల్లగలవాళ్ళను నొప్పించి ఒప్పించడం వాళ్ళపిల్ల కెట్లాగైనా పెండ్లి కావాలనే ఆదుర్దాతో ఒప్పుకోడం- ఇదీ జరుగుతున్నది! పైకి దీన్ని మోజుతో యిస్తున్నారని చెప్పడం- ఔదార్యంతో ప్రవర్తిస్తున్నట్లు కనబడడం-

ధనం:- నొప్పించి ఒప్పించడమేమిట్రా? (ఆయనవైపు తిరిగి) అవునాండీ! నేను మిమ్మల్ని నొప్పించి ఒప్పించానా?

పెద్ద:- (పలకడు. కొంచెం ఏసగా తలవూపుతాడు)

ధనం:-
విద్యా:- } (ఒక్కసారిగా) అట్లా చెప్పండి.

ధనం:- ఆయనే చెబుతున్నపుడు నీకు సందేహ మెందుకురా?

విద్యా-సందిగ్ధంగా ఆయన వూచిన తలవూపు మనిద్దరికీ వుపకరించింది. సరే, ఆయన సాక్ష్యం నాకెందుకు! నేను స్వయంగా గంటసేపట్నుండీ వింటున్నాను మీసంభాషణ. అన్నీ జాగ్రతగా విన్నాను సరేగానినాన్నా! నీవు ఎన్ని సార్లో ఎందర్తోనో కట్నం విషయంలో కరుగ్గామాట్లాడ్డం నేను చూళ్లేదంటావా? నీ కరుకుదనాన్ని చూచి ఆ దినం అన్నవరంవాళ్ళు అన్నమే తినకుండా వెళ్ళిపోలేదూ? ఒరంగల్లువాళ్ళు ఒక నిద్రకూడా చెయ్యకుండా వెళ్ళిపోలేదూ? మొన్న ఈ పెద్దమనిషికి కన్నీళ్ళపర్యంతం

తీసుకరాలేదూ ?— అన్నీ వింటూనేవున్నా. ఇంత బాధపెట్టి తీసుకున్న డబ్బుతో ఏంచేస్తామనుకున్నావ్ ? ఎవరో— కష్టపడి, కన్నగడ్డికరచి, సంపాదించుకున్న డబ్బును హక్కున్నట్లుగా పోరాడి, అక్రమంగా లాక్కోడం దుర న్యాయంగాదూ ? అదీ నీ కోసమే అంటావు! మీ ఆశ లనూ, పీనాశితనాన్ని మా పేర్ల కంటగట్టేస్తారు. పేచీలు పడటం ఎందుకంటే పిల్లలకోసం అంటారు ఆడపిల్ల గలవాళ్ళను వేధించి వేధించీ, బెదరించి, బెదరించీ, కడపటికి కన్నీళ్ళపర్యంతం తెప్పించీ మీ అభిప్రాయానికి ఒప్పించు కుంటారు. పైకి ప్రసన్నంగా కనిపిస్తూ. ఔదార్యాన్ని నటిస్తూ, లోకంచేత మెప్పించుకుంటారు. నేనెన్నిసార్లో చెప్పాను నాకు కట్నం అక్కర్లేదని! ఎంత చెప్పినాగూడా...

ధనం:— (అడ్డొచ్చి) కట్నం తీసుకొమ్మని నిన్ను బలవంతం పెట్టిందెవర్రా ? కట్నం లేకుండానే చేసుకో !

విద్యా:—కాదు. కట్నంతీసుకోకపోవడానికి కారణంగూడా వున్నది. సంఘం బాగుపడాలంటే కట్నాలపద్ధతి పటా పంచలు కావాల్సిందే !

ధనం:—ఓహో ! బయలుదేరాడురా పెద్ద దేశభక్తుడు !

విద్యా:—అవును ! అసలయిన దేశభక్తులు ఇట్లాగే బయలు దేర్తారు. ఇంకొకరకపువారి విషయం నీకే బాగా తెలుసు. కట్నాలు తీసుకోకపోవడానికి కారణం చెబుతాను. ఎందు కొస్తున్నదీ కట్నంపద్ధతి, ఇదివరకులేని నిష్పూచు ఎందు

కెంతప్రబలంగా ప్రవృద్ధమౌతున్నది. ఇదంతా మనవర్ణ ధర్మ మహిమ అంటే కులభేదాలమహిమ. మనవిద్యా మహిమ. మన ఆశలమహిమ మన అధఃపతనోన్ముఖత మహిమ. లక్షాతొంభైవేల కులాల్లోని ఒకచిన్నకులంలో చదువుకున్న సాక్షేతీన్ మందికోసం, చదువుకున్నటువంటి చదువులేనటువంటీ, పిల్లలు–అదేకులంలో చేసుకోవాలి కాబట్టి – పోటీపడుతున్నారు. ఆపోటీ, ఈ విద్యాధికుల మని గర్వించే అజ్ఞానపరులకు ఆహారమైంది. ఇంకేం! క్రూరంగాగూడా ప్రవర్తిస్తున్నారు. వారికంటేగూడా వారిపేర్తో వారితలిదండ్రులు ఘోరాన్యాయాలు చేస్తున్నారు. ఆ తలిదండ్రుల పేరుచెప్పి వీరుగూడా తప్పించుకుంటున్నారు. నీవనవచ్చు. వాళ్ళిచ్చేటప్పుడు తీసుకుంటే యేంపోయిందని! వాళ్లిస్తున్నారా? నిజంగా అదియివ్వటమేనా? అది దోపిడీగాని సాక్షిగాపుచ్చుకోవడమూ? పిల్లకోసం యిస్తున్నారన్నమాట కల్లమాట! ప్రేమతో యిస్తున్నారన్నమాట అబద్ధప్రలాపం! ఇదంతా వట్టి బూటకం! తమ్మూతాము మోసగించుకొని ఇతర్లను మోసగించడం!– దీనికి విరుగుడు స్వకులంలో పెండ్లి చేసుకోకుండా పోవడమే! ప్రస్తుతం అవసరమైనదీ అదే– నేను చేస్తూవున్నదీ అదే!

ధనం:–(ఆశ్చర్యపడ్డట్టుగా) ఆఁ, ఏమన్నావ్!

విద్యా:–కులంలో చేసుకోబోవడంలేదూ అని!

ధనం:-(కోపంగా) ఎంత వాచాలత ప్రదర్శిస్తున్నావురా! గొప్పసంఘసంస్కర్త బయలుదేరాడు!

విద్యా:-అవును! మీ మాదిరి చెయ్యడానికి మాకు మనస్కరించదు.

ధనం:-(కుర్చీనుండి లేస్తున్నట్లుగా) నోర్మూయ్!

విద్యా:-మూసినా ఇంతే.

ధనం:-మాటకుమాట అందిస్తావంట్రా గాడ్దా! (చేయిపైకెత్తును)

(పెద్దమనుష్యుడు పట్టుకుంటాడు)

[పానకాలరావు ప్రవేశం]

పాన:-అందివ్వకేమిటండీ! (ఇటుచూచి) హల్లోవిద్యాశేఖర్, అభివందనాలు!

ధనం:-అందిస్తారు! అందివ్వకేం! పెద్దా, చిన్న, గురువూ, దైవం, ఏమీ లేవుగా! (పానకాలరావు నుద్దేశించి) కూర్చోవోయ్ పానకాలరావ్! అభినందనాలంటున్నావేమిటి?

పాన:-(సరిగా, పరిస్థితు లర్థంచేసుకోనట్లుగా) అభివందనలా, అభినందనలా, మీవాడి కెన్నయినా అభివందనలు చెయ్యాల్సివుంటుంది. లేకపోతే అంతమందిలో ముందుకొచ్చి మార్గదర్శకుడౌతాడా!

ధనం:- ఎంతమందిలో నేమిటి? ఆ సభలో వీడేమన్నా...

పాన:- (అడ్డొచ్చి) ఆఁ ఆఁ మనవాడు ప్రతిజ్ఞతీసుకోగానే అందరూ అప్పుడొచ్చారు ముందుకు.

ధనం:- ఏంటి ? ప్రతిజ్ఞా ! ఆ సంస్కారసభలోనా ? కులాంతర వివాహం చేసుకుంటాననే !

పాన:- మరి !

ధనం:- (కోపాన్ని తెచ్చుకుంటూ) అవున్రా !

విద్యా:- (పలకడు)

ధనం:-(చురచురాచూస్తూ) ఏరా ఉద్రేకీ, పలకవే?

విద్యా:- ఆవిషయం ఇంతకుముందే చెప్పాను.

ధనం:- (రొప్పుతూ) పరకులంలో పెండ్లాడతాననా ?

విద్యా:- ఆ అర్థాన్నే సూచించాను.

ధనం:- ఏం ! మనకులంలో లేరనా ?

విద్యా:- పెండ్లాడితే అందరూ మనకులంవారే అవుతారు.

ధనం:- అదెట్లా అవుతార్రా ?

విద్యా:- అందరూ అయినట్లే.

ధనం:- ఏమిటా అద్వైతం.

విద్యా:-అద్వైత మార్గమే నాది.

[పనిచేసే రాముడు ప్రవేశం]

రాము:- అయ్యగారూ ! ఎవరో వచ్చారండీ ! బయట నిలబడ్డారు.

ధనం:- ఎవర్రా ? (విసుక్కుంటాడు)

రాము:- ఆవిసగం అబ్బాయికి పిల్లనిస్తామని వచ్చారే, వారు.

ధనం:- (పెద్దమనిషి వైపు చూస్తాడు)
పెద్ద:- (కొంత గాభరాగా ధనంజయరావు వైపు చూస్తాడు)
ధన:- }
పెద్ద:- } (ఏమి చెయ్యాలన్నట్టుగా విద్యాశేఖర్ వైపుచూస్తారు
విద్యా:- (అసహ్యపడుతున్నట్టుగా) ఛీ, లోకవ్యాపారం !
ధనం:- (పెద్దమనిషితో) మీరిక్కడ కూర్చోండి. (తొందర పడుతూ) మీరు ఆప్రక్కగదిలో కూర్చోండి. (పానకాలరావు వైపు చూచి) పానకాలరావ్! ఏం చెయ్యమంటావ్ ? నీవుగూడా కాసేపు ఆగదిలో కూర్చుంటావా ? (ప్రక్కగది చూపుతాడు.)
పాన:- వద్దులెండి! మళ్లావస్తాను. సెలవు (వెళ్ళిపోతాడు)
పెద్ద:- నేవెళ్తానండీ మరి, నావిషయం తేల్చలేదు.
ధనం:- (ఇంకాతొందరపడుతూ) దయచేసి నన్ను తొందర పెట్టకండి. ఇవి అంతతొందరలో తెగే విషయాలు కావు కావుగదండి, క్షమించండి (వీధిగుమ్మం వైపుఅడుగేస్తాడు)

[తెర వాలి వెంటనే లేస్తుంది. పెద్దమనుష్యుడు విద్యాశేఖరుమాత్రం కూర్చొనివుంటారు]

పెద్ద:-(విద్యాశేఖర్ వైపు శ్రద్ధగా చూస్తూ) నీవవలంబించిన పంథానే బాగున్నట్లుంది నాయనా? చూస్తున్నావా, ఇదెంత వ్యాపారంగా పరిణమించిందో! ఈ రోగానికి నీవన్నదే చక్కని విరుగుడుగా కనిపిస్తున్నది. అయితే...
విద్యా:-అదేగాదు. స్త్రీకి దాయభాగం అన్నది రెండో విరుగుడు !

పెద్ద:—అన్నీ బాగా సేవున్నవి నాయనా. పాతపద్ధతులు వదలుకోలేక పోతున్నాం.

విద్యా:—అదే, అదే. ఆభావమే వదలాలంటున్నాను. అదంతా మనం అనుకొనే భావం పైన ఆధారపడివుంది. అసలీ విప్లవం తల్లిదండ్రుల్లో రావాలి. అపుడే యిది సులభమౌతుంది.

పెద్ద:—అది రావడం కష్టం నాయనా! చూడూ, ఎవణ్ణో తెచ్చి వాడికి పిల్ల నివ్వాలంటే...

విద్యా:—(అడ్డొచ్చి) నేనెవణ్ణో కాకపోతే మీబంధువర్గంలోని వాణ్ణా? ఆ "కులం" అనే భావం మిమ్మల్నిక్కడికీడ్చింది. అంతేనా? నన్ను మరొక కులంపేరుపెట్టి పిలవండి. ఇంతకంటే శారీరకంగానూ, మానసికంగానూ మూర్తానేమో!

పెద్ద:—ఆ మార్పు ఇంతలోకే రాదునాయనా!

విద్యా:—ఆ భావమే వదలాలి. ఎపుడో అవుతుందనీ ఎవరో చేస్తారనీ, ఎందుకు నూర్చోవాలి? ఇక్కడే ఇప్పుడే, మనమే చెయ్యాలి అని అనుకుంటే ఇపుడే ఈరోగం విరగడై పోతుంది.

పెద్ద:—ఉండండి! అదేమిటో విందాం. (చెవియొగ్గి వింటారు)

[నేపథ్యంలో ధనంజయరావు రెండవ వ్యక్తితో మాట్లాడుతూవుంటాడు]

ధనం:—ఒప్పుకోడండీ, మావాడొప్పుకోడు! అంతకుపైన్నే ఏమైనా!

రెం.వ్య:-అదేమిటండీ! పట్టుమని పదిరోజులన్నా గాలేదు. అప్పుడే యిరవై వేలెక్కించేశారేం!

ధనం:-నేనెక్కించే దేముందండీ!

రెం.వ్య:-మొన్న నేగద డీ నలభై వేలకు తగ్గనన్నారూ!

ధన:-(గొంతు బలవంతంగా బిగబట్టి) యాభై వేల దూపా యలూ ఒక కారూ యిపుడే యిస్తాన టూ వచ్చిన పెద్దమనిషి అదుగో అక్కడే వున్నాడు. దానికికూడా మావాడొప్పుకోలేదు. చూశారూ, మీరు పైన పదివే లన్నా అనందే...

(రంగంలో)

పెద్ద:-చూశావా నాయనా, మీనాన్న ఎంత ఆశ...

విద్యా:-(అడ్డొచ్చి) ఆయన తప్పుకంటే మీతప్పే పెద్దది.

పెద్ద:-అంటే!

విద్యా:-పిల్లలకని, వాళ్ళ వివాహ విషయం మీనెత్తిన వేసు కొని వరుడి తలిదండ్రులను లోభ పెడుతున్నారు. అర్థం లేనిగిరులు గీచుకొని గుడుగుడుగుంచం అంటున్నారు ఆ గిరి దాటితే యెంతమంది వరుళ్ళయినా యేమీయివ్వ నక్కర్లేకుండా దొరుకుతారు.

పెద్ద:-కావచ్చు. కాని...

విద్యా:-కానీఅంటే పిల్లలకు పెండ్లిండ్లు కాకనూపోవచ్చు. ఎన్నా ళ్ళకూ పెండ్లిండ్లు కాక వాళ్ళు పెడదారి త్రొక్కావచ్చు.

భ్రూణహత్యలూ, శిశుహత్యలూ జరగావచ్చు. మీ కులాలుమాత్రం ఏమీ చెదరకుండా ఉండనూవచ్చు.

పెద్ద:-(ప్రసన్నంగాచూస్తూ) ఊఁహుఁహుఁహుఁ (అని ముసిముసినవ్వులు నవ్వుతూ) ఆగండి. ఆగండి. కాస్తవినిందాం వాళ్ళప్రసంగం.

(నేపథ్యంలోనుంచి)

ధనం:-ఆమాటచెప్పండి వాళ్ళతో. మీరేచూస్తున్నారుగా ఆ పెద్దమనిషిని! ఆయన బేరంకంటే మీ బేరం హెచ్చితేనే విలవుతుందని గట్టిగా వాళ్ళకు చెప్పండి. వాళ్లు అరవై వేలిస్తే ఆరువంపెలు మీవనుకోండి.

రెం. వ్య:-అబ్బే! నాడబ్బుక తెందుకండీ! మీరూమీరూసమాధానపడి కార్యంకాస్త జరగాలిగాని నాదెక్కడికిపోతుంది చెప్పండీ! వాళ్ళుమాత్రం ఆనాటిమాదిరిగా ముప్ఫయివేలకే బేరమాడి అప్పటికీ ఒప్పుకోకపోతే నలభైవేలను దమ్మిడీమించవద్దన్నారు. మళ్ళా ఏంచెబుతారోచూస్తాను.

ధనం:-అదిగూడా మూన్నాళ్ళల్లో తేలిపోవాలి. లేకపోతే యీ పెద్దమనిషికి మాటిచ్చేస్తాను.

రెం. వ్య:-మరింక సెలవా?

ధనం:-మంచిదండి! చూడండీ! రేపులేదు, యెల్లుండిలేదు, ఆవలెల్లుండికి జాబైనారావాలి లేకపోతేమీరైనారావాలి.

రెం. వ్య:-చిత్తం! చిత్తం! (నిష్క్రమణ)

(ఒకనిమిషంతర్వాత గదిలోకివచ్చి)

ధనం:—మావాడు మంచినక్షత్రంలో పుట్టాడండీ! చదువు లోనూ యితరవిషయాల్లోనూ, పెండ్లివిషయంలోనూ అన్నిట్లోనూగూడా బరాబర్ (సగర్వంగాకొడుకువైపు చూస్తాడు)

పె. మ:—(కాస్త అనిష్టంగా) అవచ్చినాయన దేవ్వారండీ?

ధనం:—దగ్గరేలెండి పాతిబేరం! అరవై వేలకు ఖరారుచేసుకొని పోతున్నాడు. పైగా కారుకూడా (చిరునవ్వు)

పె. మ:—(వ్యంగ్యంగా) ఖరారయిందాండీ?

ధనం:—ఆఁఆఁ, అవును! అయితే నేనే ఒప్పుకోలేదులెండి! తొందరపడితే వెనక చింతిం చాల్సొస్తుందని;

పె. మ:—(ఇంకా అనిష్టంగా) మరి నామాటేంచెప్పారు?

ధనం:—చెబుతున్నాగదండీ! తర్వాత మాట్లాడవలసినవారు మీరేగా!

పె. మ:—(నోరుతెరుచుకొని శూన్యంగాచూస్తాడు)

(నేపథ్యంలో)

(భోజనాలు వడ్డించామని చెప్పారాముడూ అని వినిపిస్తుంది.)

(రంగంలో)

ధనం:—లేవండి, కాస్తభోంచేసి కూర్చుందాం.

పె. మ:—వద్దులెండి కతికినచోట అతకదన్నారు.

ధనం:—(నవ్వుతూ) అదేంటండోయ్! అది ఆడపిల్ల పెత్తనం విషయంలో!

పె. మ:-(వ్యంగ్యంగానవ్వుతూ) అది వ్యత్యస్తమయిందిలెండి ప్రస్తుతం ! మరిసెలవా ?

ధనం:-మళ్లా దర్శనం ?

పె. మ:-వ్రాస్తాగా ! (పెద్దమనిషి వెళ్ళిపోతాడు. దనంజయరావు అతనివైపు చూస్తూవుండగా)

(తెర)

---

## నా లు గ వ ర ం గ ం

[రమాసుందరి విచారంగా కూర్చొనివుంటుంది. ప్రబలంగా ఆలోచిస్తూవుంటుంది, వినోదరావు కొంచెంజడుస్తూ ప్రవేశిస్తాడు]

వినో:- (గొంతు అణచుకుంటూ) అమానుషం ! ఆసురం !

రమా:- (పలకదు. సాభిప్రాయంగా చూస్తూవుంటుంది)

వినో:- (కూర్చుంటూ, ఆమెవైపుచూచి) నిన్న రెండుసార్లు ప్రయత్నంచేశానమ్మా ఇక్కడికి రావడానికి ! అసలు మీనాన్న యింట్లోనుండి కదలందే ! సరేగాని, వీళ్ళకు కోపంవస్తే కన్నబిడ్డలనిగూడా వుండదు గాబోలు ! కొరివి పట్టుకొచ్చాడటగదూ కాలుస్తానని ?

రమా:-ఒకటేమిటి ? అన్నిరకాల హింసలూ రుచి చూచాను మొన్నటినుండీ ! పగవాడికిగూడా వద్దుబాబూ యీ బాధలు ! ఈ వివాహమే అక్కర్లే దనిపిస్తుంది.

వినో:- అదేమిటి! ఆ శ్మశానవైరాగ్యం!

రమా:- శ్మశానంలో కూర్చున్న తర్వాతగూడా వైరాగ్యం రాకపోతే యెట్లా?

వినో:-అంత నిరుత్సాహంగా మాట్లాడతావేఁ?

రమా:- నీకు పురోహితుడి కూతురువిషయం తెలిసిందా?

వినో:- విన్నదంతా నిజమేనా?

రమా:- ఆమె మెడకు వురితగిలించాడట ఆ చాదస్తుడు! అది తెలుసా?

వినో:- ఓరి బుద్ధిహీనుడా! అంతపని చేశాడూ? ఇవన్నీ తెలుసుకోడానికి మాకు తీరికేది? మాగొడవలుచాలావున్నాయి. ఆఁ ఏమిటీ, అంత తప్పేం చేసిందంట!

రమా:- తప్పేముంది? మొన్న అదిగూడా ప్రతిజ్ఞ తీసుకుందిగా!

వినో:- అందులో తప్పేముంది? లక్షణంగా వివాహమాడ్తుంది! ఆయనమాది రేమైనా...

రమా:- (అడ్డొచ్చి) ఆయన గొడవ మనకెందుకు?

వినో:- ఆయన విధవ చెల్లెల్లాగా....

రమా:- (అడ్డొచ్చి) అబ్బా! మనం వాళ్ళతప్పు లెన్నుతూ కూర్చుంటే యెట్లా?

వినో:- ఎన్నకపోతే కుళ్ళు బయటపడేదెట్లా? సంస్కర్తలు కుళ్ళు ఏదో తెలుసుకొని దాన్ని బయటికి లాగకపోతే యెట్లా అవుతుంది?

రమా:- నే చెప్పేది వినుమరి! తానుగూడా మొతకు వురి వేసుకొన్నాడట! అప్పటికే బాగాకొట్టాడట ఆపిల్లను, వివాదంవచ్చి. ఊరికే యేమస్తాడట! ప్రతిజ్ఞను వదిలేస్తున్నా నన్నంతవరకూ కాకిగోల చేశాడట!

వినో:- అయితే ఆమె ప్రతిజ్ఞను వదలు కున్నట్లేనా?

రమా:- అన్నదట మరి!

వినో:- అంతమాత్రానికి ప్రతిజ్ఞెందుకు? యింత చదువుకున్న పిల్లలే యిట్లా పిరికిపందలై . . .

రమా:- (అడ్డొచ్చి) మరి చేసేదేముంది వినోదరావ్! నువ్వు చస్తావా, నేను చచ్చేదా అని కూర్చుంటే చేసేదేముంది? ఎవరుమాత్రం అట్లాచెయ్యక తప్పేదేముంది?

వినో:- (హేళనగా) అయితే నువ్వుగూడా అట్లాగే చేశావా యేమిటి?

రమా:- (తల వంచుకొని) అంతే చెయ్యాల్సొచ్చింది.

వినో:- (సంచలించినట్లుగా) ఆఁ ఏమన్నావ్? ప్రతిజ్ఞకే తిలోదకాలిచ్చావా? అంతమందిలోనూ ముందుకొచ్చి ప్రతిజ్ఞ చేసి యీనాడు తేలిగ్గా వదిలేశావా? అదేనా ప్రతిజ్ఞంటే. ఇదేనా మీలాంటి విద్యాధికయువతులు చెయ్యాల్సినపని! మిమ్మల్ని నమ్ముకున్న వారిగతేమిటి?

రమా:- (చూస్తూవుంటుంది)

వినో:- (గంభీరంగా) విద్యాసాగర్ గతేమయిందో తెలుసా? వాళ్ళనాన్న నిన్న అతన్ని నానా శాపనార్థాలూ పెట్టినను. అగ్ని

కొత్తగా చదువుకో. నల్లో చూస్తే వేలస్తామని వచ్చినవా క్ళ్ంచర్ళ్ని వెనక్కి పంపేశాడు. తండ్రి నెదిరించాడు. అతడు కోపమొచ్చి కొడుకును నానాతిట్లూ తిట్టి కొట్టబో యాడు. చాలా రభస జరిగింది. కడపటికి గదిలో వేసి తాళంవేశాడు.

రమా:- (హతబుద్ధయై) ఇంత ఇట్లాగా! క్రౌర్యం, దౌష్ట్యం!

మనో:- వినుమరి! అన్నం పెట్టవద్దన్నాడు. మంచినీళ్ళుగూడా యీవద్దని కావలి కూర్చున్నాడు. అతడు శోషకపోయి పడిపోయుండగానే. నేను స్పష్టంగావాదించి చెలువిడిపిం చాను. ఇపుడు కోలుకుంటున్నాడు. ఇంతలో నీ జాబు వచ్చింది. ఏ పరిస్థితిలోఅయితే నీ ప్రేమను తూష్ణీం భావంతో తిరస్కరించేశాడో అటువంటి వాతావరణంలో వచ్చింది. ఆ జాబే అతని చేతిలోపడి వుంటే నిన్ను అతి చంచల స్వభావ అనీ, విచక్షణాజ్ఞానశూన్య అనీ భావించి అసలు నీగాలే సోకకుండా పారిపోయేవాడు. (తలెత్తి నిదానంగాచూచి) యెందుకొచ్చిందీ వింతదోరణి నీకు!

( నే ప థ్యం లో )

ఏమే అనింకా ఆ కొట్లోనే యేడుస్తున్నదా?

( రం గం లో )

రమా:- (కన్నీరు తుడుచుకుంటూ గాభరాతో) ఎట్లా?

మనో:- (సంభ్రమంగా) ఎట్లా!

రమా:- ఈ దారిన వెళ్ళిపో, ఆయనకంట పడకూడదు.

(వినోదరావు నిష్క్రమణం)

[వినాయకరావు రంగంలోకివచ్చి నేరుగా లోపలికి వెళ్తాడు రమాసుందరి మౌనంగా కూర్చొని వుంటుంది. కన్నీరు కారుస్తూవుంటుంది. పాట వినిపిస్తుంది.]

(నేపథ్యం లోనుంచిపాట)

అబలా
ఓ అబలా!
సబలనంచు గడు
సరిగ బలికెదవు
సమయమునకు బహు.
పిరికి వయ్యెదవు ... అబలా||

కన్యాశుల్కం కట్నమాయెగద
కట్నమీయనిదే పెండ్లి గాదుగద
కట్నంకోసం కన్నవాళ్ళు యమ
యాతనపడగా సిగ్గు లేద నీ ... కబలా||

ఒకని కోసమై నూర్లు వేలు
కట్నాలు జూపి పోటీలు చేయగా
విద్యాధిక విజ్ఞానమూర్తి వ
జ్ఞాని వలెను పోటీలో పడెదవె... అబలా||

కులమని శాఖని గీత గీచుకొని
గిరిలో కూర్చొని గుడుగుడుగుంచం
మాని స్వేచ్ఛమై స్వస్తి చెప్పి కూ
పస్థమైన మండూక పద్ధతికి... అబలా||

గిరిని దాటుమా, కోటదాటుమా
శాఖ బాహ్యాసంఘాన్ని చూడుమా
సర్వగుణాలంకారశోభితులు
వేలువరులు మరి వరించుకొనుమా అబలా॥

రమా:-(నూత్నోత్సాహంతో) ఏమైనాసరే ! త్యజిస్తాను ! నా తలిదండ్రుల సైతం త్యజిస్తాను. నా ఆశయ సిద్ధి కోసం, సంఘ శ్రేయస్సుకోసం త్యజిస్తాను.

(కించిద్విహాసవదనంతో చూస్తూండగా తెర)

---

## అయిదవ రంగం

[మనుషులు అటూ యిటూ హడావిడిగా తిరుగుతూ వుంటారు. కొందరు తాజాగా షికారుపోతున్నట్లు, కొందరు పొద్దుపోక తిరుగుతుం వున్నట్లు, తిరుగుతూవుంటారు.]

[ఇద్దరు వ్యక్తులు తారసిల్లి]

మొదటి:-ఏమండోయ్ సుబ్బన్నదొరగారూ ! చూశారా ? యెపుడూ కననీ, కడపటికీ వినని, సంఘటనలు జరుగుతున్నాయ్.

రెండవ:-అంతా కలికాల మహిమ !

మొదటి:-ఏదో మామూలుధోరణిలో అంటున్నారు. అసలు విషయం తెలియదా యేమిటి ?

రెండవ:-యేమిటా రహస్యం ?

మొదటి:-యీవూళ్ళో ఒక కొత్త ఉద్యమం బయలుదేరింది. ఆడపిల్లలూ మొగపిల్లలూ ఒక్కసారిగా జట్లు జట్లుగా లేచిపోవడం!

రెండవ:-ఛీ ఛీ ఛీ! ఎంత అన్యాయం.

మొదటి:-అన్యాయమేమిటిలే! అంతా అవసరమే!

రెండవ:-ఆ లేచిపోవడమేమిటి ?

మొదటి:-అది లేచిపోవడ మనిపించుకోదు. అది వివాహోద్యమం.

రెండవ:-ఇంతకూ మొదలెవరేమిటి ?

మొదటి:-ధనంజయరావు కొడుకు విద్యాసాగరూ, వినాయకరావు కూతురు రమాసుందరీనూ.

రెండవ:-ఉద్యమమంటే యిదేనా ?

మొదటి:-అంతేనా ? ఇంకావున్నారు! వినోదరావూ వివేకవతీ-పానకాలరావుకొడుకు రవివర్మ, పురోహితుడికూతురు-ఇదొకవుద్యమంలే సామూహిక వివాహోద్యమం! దాన్నే ఇంగ్లీషులోక మ్యూనిటీ మేరేజెస్ (Community Marria-ges) అంటారు.

రెండవ:-సెబాస్! చాలాబాగుంది!

(నిష్క్రమణ)

[ఇద్దరువిద్యార్థులు తారసిల్లి]

మొదటి:-అదేమిటోయ్ అంతహడావిడిగా నడుస్తున్నావ్ ?

రెండవ:—మనవాళ్ళంతా గుంటూరికి వెళ్ళినట్లు పానకాలరావు గారింట్లో బయట పడిందట! రూఢిగా తెలుసుకుందా మని పోతున్నాను. నీవూవస్తావా?

మొదటి:—పద! (ప్రక్కనన డుస్తూ) ఇదెంత జయప్రదంగా జరిగిందిరా కడపటికి! అసలు ఉద్యమాలు ప్రారంభించా లన్నా, జయావహంగా నడపాలన్నా మందేపై చేయి! మనవిద్యార్థిలోకమే లేకపోతే మననాయకులంతా వినా యకు లైపోతారు.

రెండవ:—ఖుమ్మాటికీ!

మొద:—ఆంధ్రవిద్యార్థి ప్రతీకంగా మన విద్యాసాగరే వున్నా డుగా! ఇంత ఆర్గనైజేషనుకూ ఇతడే కారకుడు! మహా నాయకునిలో వుండవలసిన లక్షణాలన్నీ అతనిలోవున్నాయి సరే, యికవస్తా! వచ్చేటట్లయితే నీవుగూడారా,

(నిష్క్రమణ)

(ఇద్దరు పురోహితులు తారసిల్లి)

మొదటి:—చూశారటండోయ్ రామశాస్త్రిగారూ, కాలం ఎంత విపరీతమై పోయిందో!

రెండవ:—వినాశ కాలం దగ్గరకొచ్చిందండి!

మొదటి:—అయినా, బాపనపిల్లలకు అబ్రాహ్మణ వరుళ్ళూ— అబ్రాహ్మణపిల్లలకు బ్రాహ్మణవరుళ్ళూ ఏమిటీవరస? ప్రపంచం యింకా నాశనమైపోకుండా వుంటుందా?

రెండవ:—వినాశకాలంవచ్చిందండీ! అంతా ఒకటే అయి పోయింది! హెచ్చూతగ్గూ – పెద్దా చిన్నా – ఏమీ లేకుండా పోతూవుంది! ఇంతకూ మనపిల్లలే మనల్ని మోసం చేస్తూవుంటే యింక చేసేదేముంది చెప్పండి!

మొదటి:—పాపం, ఆ పురోహితుడిగోల చెప్పడానికి వీలులేదు. అతనికూతురు వాణ్ణెవణ్ణో చేసుకుందని కాదట! అసలు మనకులంలో దొరికేవాళ్ళకంటే వాడే యెన్నిరెట్లో మెరుగ్గావున్నాడట! అయితే యితర్లింక తనను పౌరోహిత్యానికి పిలవరేమో అని యేడుస్తున్నాడు అందుకే ఒకసారట్లా వెళ్ళి ఓదారుద్దామని పోతున్నా—

(నిష్క్రమణ)

(ఇద్దరుబోడెమ్మలు తారసిల్లి)

మొదటి:— చూశావటే రంగమ్మక్కా! ఎంత అన్యాయానికి పాలు పడ్డారే యీ కుఱ్ఱకుంకలు యీ చదువులంటూ తగులబడి మన ఆచారాల్నంతా ఎంత తలకిందులు చేస్తున్నారో చూశావా? అసలీ పిల్ల ముండలకు చదువేంటి?

రెండవ:— చదువేమిటి వెధవచదువు! అంతా ఏకీభేకం! నువ్వు చదివావా, నేనుచదివానా? మనకున్న తెలివి యీ పిల్లముండల కేనాటికయినా వస్తుందంటావా?

మొదటి:- వెయ్యిజన్మలెత్తి తలకిందుగా తపస్సు చేసినా రాదు!

రెండవ:- ఎవరో వకడికి చిన్నపుడే అంటగట్టేస్తే తీరిపోయేది! అట్లా చేస్తేనా? మనవాళ్ళే చదువు చెప్పించాలని కూర్చున్నారాయె! ఇపుడు అనుభవించాలి! కులాలూ, కులాచారాలూ, హెచ్చుతక్కువలూ, అన్నీ తగులబడిపోతూ వుంటె చూస్తూకూర్చోవాలి!

మొదటి:- ఎంత అనాచారం! పోనీలేమ్మా మనకెందుకీగోల!

(తెర వాలి వెంటనే లేస్తుంది)

(ధనంజయరావు అవనత శిరస్కుడై వుంటాడు)

(రాముడు ప్రవేశిస్తాడు)

ధనం:- రాముడూ! వాళ్ళ జాడేమయినా తెలిసిందా!

రాము:- ఇంకా యేంజాడండీ! ఈ మూన్నాళ్ళూ అంతా చెడదిరిగాం. ఎక్కడా కనబడందే!

ధనం:- బెజవాడా, కాకినాడా, వెళ్ళినవాళ్ళొచ్చారా?

రాము:- అందరూ వట్టిచేతుల్తో వచ్చారు.

ధనం:- భగవంతుడా! (తల పట్టుకుంటాడు)

రాము:- ఇపుడు దుఃఖిస్తే యేమొస్తుందండీ! ముందే...

ధనం:- ఇంతవుతుందని యెవడనుకున్నాడురా?

రాము:- ఇపుడు మించిపోయిందేముంది? ఉన్న ఒక్క కొడుకూ వెళ్ళిపోయాడు ఇకేం దర్జాగా వుండొచ్చుగా!

ధనం:- నన్నెందుకురాఅందరూ పొడిచినట్లు మాట్లాడుతారు!

(పురోహితుడు ప్రవేశిస్తాడు)

పురో:- (నెత్తి బాదుకుంటూ) మీరుగూడా యిట్లా కూర్చున్నారేమిటండీ ధనంజయరావుగారూ! అన్నీవున్న మీరూ, లేని నేనూ, వకటే! వెదికించి పట్టుకోద్దురూ బాబూ! కండ్లారా చూడనన్నా చూస్తాను.

ధనం:- ఎక్కడా వాళ్ళ పోలకువలేందే! ఎక్కడికెళ్ళారో అంతుతెలిస్తేనా?

పురో:- అయ్యో భగవంతుడా? ఒక్కగానొక్క కూతురండీ! దానిమాట వినివుంటే యెంతో హాయిగావుండేది!

(వినాయకరావు ప్రవేశం)

వినా:- హాయిగా వుండడానికి మనం నోచుకొనివుంటేగదా! లేనిపోని అభిమానాల్లో పడ్డాం! అజ్ఞానంతో ప్రవర్తించి ఇపు డఘోరిస్తేమాత్రం వచ్చేలాభమేముంది?

పురో:- ఈ కైతవబుద్ధులు అందుకొప్పుకోలేదుగా మొదట!

ధనం:- ఏమయినాజాడలు తెలిశాయా వినాయకరావుగారూ?

వినా:- తెలిస్తే యీ యేడుపుమొగంతో యెందుకొస్తానండీ, వియ్యేంకుడికీవిలో కనుపించకపోయేవాణ్ణా? (చిరునవ్వు)

ధనం:- పిల్లవాళ్ళు మనకు బుద్ధివచ్చేటట్టు చేశారండి! (చిరునవ్వు నవ్వుతాడు)

[సన్యాసిరావు ప్రవేశం]

సన్యా:- బుద్ధి ముమ్మాటికీ నేర్చారు ! ఇంతగా మనోవ్యథల పాలయ్యాక తెలుసుకున్నాం అసలుతత్వాన్ని.

పురో:-తపస్సు లో కాలందే సత్యాన్ని చూడగలదామనస్సు!

సన్యా.- ఓహో ! పురోహితులవారుకూడా మారిపోయినట్టున్నారే !

పురో:- మారకపోవడమెట్లాగండీ ? అజ్ఞానంచేత అడ్డజూస్తున్నామేగాని కాలప్రవాహాన్ని ఎవడడ్డగలడూ !

సన్యా:-పానకాలరావుగారివియ్యంకులై పోతున్నారన్నమాట!

పురో:- అవును ; ధనంజయరావుగారికి వినాయకరావుగారిలాగా !

సన్యా:- అదేపానకాలరావుగారికి వినాయకరావుగారువియ్యంకులై పోతున్నారు.

ధనం:- చమత్కారంగా కలిసింది బాంధవ్యం !

సన్యా:- అనుకుంటే అంతా బంధువులై పోతారు. ఆ భావమే అవసరం !

ధనం:- అంతేమరి ! భేదభావం మార్చుకుంటే అంతా బంధువులే అయిపోతారు !

పురో:- అసలు పానకాలరావు ఏమయ్యాడో తెలుసామీకు?

సన్యా:- ఈ నాటకానికంతా అతడు నేపథ్యం ! ఆ విషయం తెలుసామీకు ? పదండి, అందరూ యీబండికిదిగుతారట! కాలేజీ పిల్లలంతా ప్లాట్ఫారం అలంకరించారు పదండి !

పురో:- పదండిబాబూ ! పదండి ! మన చేతులారా వాళ్ళ నెత్తిన అక్షింతలువేసి ఆశీర్వాదిద్దాం.

ధనం:-
వినా:- } పదండి ! పదండి !
సన్యా:-

(తెర పడుతుంది)

సంపూర్ణం





అంతటి నరసింహంగారు

జననం 1925 లో. జన్మస్థలం కడపజిల్లా వెంకటరాజు పల్లి. విద్యాభ్యాసం :-రాజంపేట బోర్డు హైస్కూలు, అనంత పురం ఆర్ట్సు కాలేజి, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం. తెలుగు ఎం. ఏ., హిందీ విశారద. ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. 1943 నుండి రచనా వ్యాసంగం.

గేయకావ్యములు :—కవిసమ్మేళనం, అర్పణం.

సాంఘిక నవలలు :—ఆదర్శం, భావం, స్వాగతం, ప్రేమ భిక్ష, శోభాదేవి.

చారిత్రిక నవలలు :—రామరాయలు

నాటకాలు :—పరిష్కారం, భువనవిజయం, సామరస్యం, మానవత్వం, సహజీవనం (ప్రభుత్వ బహుమతి పొందినది.)

అభిమాన విషయములు :—అస్పృశ్యతా నివారణ, వర్ణాంతర వివాహాలు, వర్ణవర్గభేదనిర్మూలనం, స్త్రీవిద్య.

ప్రాప్తిస్థానం :—భేరి సీతారాఘవమ్మ,
19/5, విప్పర్తివారి వీధి, విశాఖపట్నం.